C




రచన

# పడాల రామా రావు

# ఇదా స్వతంత్రం?

[నాటకం]



పడాల రామారావు



ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ

2

తొలి కూర్పు
వేయి ప్రతులూ
మార్చి 1953
కల్యాణి ప్రెస్
విజయవాడ

వెల : ముప్పావలా



సంపాదకుడు :
గద్దె లింగయ్య

3

# అంకితం

నా రక్తనేస్తం—అమరుడు మృత్యుంజయునికి

ఓహో! నా రక్త నేస్తమా
అమరుడవోయ్! మృత్యుంజయ!
సమలోకపు సాధనకై
శ్రమజీవుల సుఖమునకై
సమయని, దృఢశక్తితో
జ్వలించేటి నీ తేజం
నిస్తేజం చేద్దామని
కైపెక్కిన రక్కసులూ
అర్ధరాత్రి నిన్ను పట్టి
నీ ఎముకలు చిదుకకొట్టి
నీ చర్మం చీల్చివేసి
నీ రుధిరమే కండ్లచూచి
నిలువున నీ నిండుగుండె
మండబెట్ట లంఘించిన
వేటుతిన్న మృగరాజువై
దథదథ భూమ్యాకాశాల్
దద్దరిల్ల గర్జించావట
రెచ్చిన రుద్రుడవై
గథగథ గుండెలదర
చేశావట—ప్రళయ నృత్యం
ఓహోహో! మృత్యుంజయ!

అఖరి కా హడలిన
కర్కశ రక్కసి మూకలు
చెట్టుకు నిన్ను కట్టి
మందుగుండు దట్టించి
ఒకటి కాదు, రెండు కాదు
మూడుసార్లు నిన్ను కాల్చ
భువి నొరిగినా.........
బిగించి పిడికిలి
"జిందాబాద్ లాల్‌బావుటా!"
"జిందాబాద్ రివల్యూషన్!"
అని చేశావట—సింహనాదం
ఓహోహో! మృత్యుంజయ!
తెలుగువీరుల తెగువ చూపిన
నీ నామం—తెలుగుదేశం
యుగయుగాల స్మరిస్తుంది
జిందాబాద్ రివల్యూషన్
అని ముందుకు సాగుతుందోయ్ ॥ఓ॥



28.8.54

# నా మాట

ఇది నా మూడో నాటకం. మొదటిది "నేతబిడ్డ" తొలి ప్రచురణ పూర్తిగా అమ్ముడుపోవటం, ఆంధ్రదేశం నలుమూలలా సుమారు 70 ప్రదర్శనలు యివ్వడం. ఏలూరు టౌను కేపిటలు హాలులో జరిగిన ప్రదర్శనంలో రచనకు వెండిషీల్డు బహూకరించబడడం జరిగింది. ఇక రెండోది "సందేశం" ఇది శాంతి కోసం రాయబడిన నాటకం. యీ నాటకం. రాజమండ్రి, మండపేట, సూర్యాపేట, వరంగల్లు (నైజాం), కపిళేశ్వరపురం (కృష్ణాజిల్లా) వగైరా చాలా ప్రాంతాల్లో ప్రదర్శించబడింది. "నేతబిడ్డ" నాటకంతోపాటు ఈ నాటకం కూడా అనేక పత్రికల ప్రశంసల నందుకుంది. "ఇదా స్వతంత్రం!" నా మూడో రచన. ఆరేండ్లు కడు భారంగా, విషాదంగా శ్రమజీవులు జీవితాన్ని గడిపేరు. ఏడుస్తూ ఏడవఏటిలో పాదం పెట్టారు. గతించిన ఆరేండ్ల స్వాతంత్ర్యంయొక్క నిజస్వరూపం యీ నాటకంలో చిత్రించబడింది. అంతేకాదు. యీ ఆరేండ్లలోనూ పేదప్రజలు దుఃఖానికి, సుఖానికి మధ్య జరిగిన సంఘర్షణ యీ నాటకంలో చూస్తారు. అసలు సంఘర్షణ—అభ్యుదయానికి సాధనం. యీ సంఘర్షణ అనేక రూపాల్లో నిరంతరం జరుగుతూనే వుంటుంది. అందుకే "పోరాటం లేనిదే పురోగమనం లేదు." ఒక్క ముక్కలో చెప్పాలంటే జీవితమే—సంఘర్షణ. అంచేత కళ కూడా ఆ జీవితంకోసం జరుగుతున్న సంఘర్షణను చిత్రించాలి. అప్పుడే కళ సార్థకమౌతుంది. నాటకం కూడా అంతే. జీవితానికి సంఘర్షణ ఎంత ప్రధానమో నాటకానికి "కదలిక" కూడా

అంత ప్రధానం. యీ కదలిక లోపించినపుడు నాటకం దెబ్బ తింటుంది. అయితే ఎంత 'కదలిక'ను నీవు సాధించినా, బలమైన విషయం—అంటే పాత్ర—క్రొత్తలకు మధ్య జరిగే జీవిత సంఘర్షణయొక్క వాస్తవికచిత్రణ లోపించినా నాటకం దెబ్బతింటుంది. అంచేత నాటకంలో విషయం ఎంత ప్రధానమో శిల్పంకూడా అంతే ప్రధానం. అందుకే మన పురాతన నాటకకర్తలు కూడా నాటకానికి 'విషయం—ఆత్మ. శిల్పం—దేహం' అన్నారు.

అయితే అభివృద్ధి నిరోధక విషయాన్ని తన కళా నైపుణ్యంతో రాణింపజేసే రచయిత, విషగుళికకు తేనెపూత పూస్తున్నాడనే విషయం మరచిపోకూడదు. అభివృద్ధికర విషయానికి శిల్పనైపుణ్యం కొరవడినా పరవాలేదు. అందుకే గోర్కీలాంటి మహాకవులు యీ విషయంలో విషయానికి తొలిస్థానం ఇచ్చారు. అంటే శిల్పాన్ని తక్కువ అంచనావేశారని కాదు. "నాటకానికి కదలిక, వేగం, శక్తివంతమైన భావోద్రేకం, సునిశిత దృక్పథం, కరకైన భావప్రకటన అవసరం" అన్నాడు గోర్కీ. యిలా తయారుగావాలంటే రచయిత ప్రజాజీవిత అంతర్వాహినిలో యీది, ఆలోని జీవిత పరమసత్యాన్ని ఎత్తి చూపాలి. అంటే ప్రజలతో అతి సన్నిహిత సంబంధాన్ని రచయిత పెంపొందించుకోవాలి. యీ దృక్పథంతోనే నే నీ నాటకం రాశాను. ప్రజల్లోనే పనిచేసి, ప్రజాసమస్యనే చిత్రించాను. అదెంతవరకూ జయప్రదమయ్యిందో నిర్ణయించాల్సింది మీరు.

ది 16-8-52 న రాజమండ్రిలో యీ నాటకం తొలిత ప్రదర్శించినప్పుడు దానికి ప్రారంభోత్సవం జరిపిన శ్రీ పందిరి

మల్లికార్జునరావుగారు 'ఇటువంటి ప్రజాజీవితాన్ని చిత్రించే నాటకం బహిరంగ ప్రదర్శనవల్ల మరింత రాణిస్తుంది' అని సలహా యిచ్చారు. ఇది నాకే కాదు, నాటకాల నిర్వాహకుల కందరికీ శిరోధార్యమే.

తరువాత ఏలూరు ఆంధ్రరాష్ట్ర సాంస్కృతిక మహాసభ వైజ్ఞానికోత్సవాల్లో ది 31-8-52 న ప్రదర్శించాక, శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారు ఒక సలహా యిస్తూ ఆంధ్రదేశంలోని నాటకాల రచనలో యీ "ఇదా స్వతంత్రం?" రెండో కోవకు చెందుతుందన్నారు. అంటే శిల్పం లోపించిందని వారి విమర్శ. యీ విమర్శను హృదయపూర్వకంగా స్వీకరించాను. శిల్పానికై పుణ్య పెంపుకు నాకు వుత్సాహమిచ్చిన శ్రీ తుమ్మలకు నా ధన్యవాదాలు.

నాటకం అన్ని సారస్వతరూపాల్లోకీ అత్యున్నత స్వరూపం. శ్రీ అవసరాల సూర్యారావుగారు రాజమండ్రి ప్రదర్శనానికి పంపిన సందేశంలో షేర్కొన్నట్టు "అన్ని కళలూ చేయీ చేయీ కలిపేచోటు రంగస్థలం." అంచేత నాటక రచయితకు సారస్వతంలోనేకాక అన్ని కళారంగాలలోనూ, సర్వతోముఖ పరిజ్ఞానం వుండాలి. అంతేగాక ప్రధానంగా రచయితకు కావల్సింది పరిపూర్ణ జీవితానుభవం. వీటన్నింటిని ఆకళింపు చేసుకోవాలంటే ఏ ఒక్కసారిగానో సాధ్యమయ్యేదికాదు. నిరంతర అధ్యయనంద్వారానే అది జరగాలి. అందుకు మీరు సంపూర్ణ సహకారమిస్తే అహోరాత్రులూ కృషిచేస్తాను.

తొలుత యీ నాటక చిత్తుప్రతికి శ్రీ డాక్టరు రాజారావుగారిచ్చిన సలహాలతో రిహార్సల్సు ప్రతిని తయారుచేశాను.

రిహార్సల్సులో, తరువాతవచ్చిన లోపాలను సరిచేసుకొని తొలి ప్రదర్శన యిచ్చాను. తొలిప్రదర్శనానంతరం శ్రీ పందిరి మల్లికార్జునరావుగారి సలహాలను, ప్రేక్షకుల సలహాలను తీసుకొని, నాటకాన్ని మరింత తేజోవంతంచేశాను. ఏలూరు కేపిటలుహాలు ప్రదర్శనానంతరం శ్రీ తుమ్మల యిచ్చిన సలహాను శిరసా వహించి, మరికొన్ని మార్పులతో మిత్రుల కోరికపై యిక పాఠకలోకంముందు పెడుతున్నా. ఇక యీ నాటకానికి మరింత జీవం పోయాల్సిన బాధ్యత మీది. మీ విమర్శనలను, సలహాలను కళ్ల నద్దుకొని స్వీకరించి, ద్వితీయ ముద్రణలో సరిచేసుకొనే బాధ్యత నాది.

సెలవ్
భవదీయుడు
పడాల రామారావు

రాజమండ్రి,
1-3-53



## ఇందులో

| | | | |
|---|---|---|---|
| భూషణం | వయస్సు | 25 సం॥లు | |
| ఉమ | ,, | 20 | |
| నర్సు | ,, | 30 | |
| రంగయ్య | ,, | 35 | షాహుకారు |
| మల్లూరాం | ,, | 50 | మార్వాడి |
| సత్యం | ,, | 25 | కవి, గుమాస్తా |
| శారద | ,, | 20 | ,, ,, భార్య |
| ముత్యాలు | ,, | 50 | కార్మికనాయకుడు |

వస్తారు.

కాలం: ఆకలి ఆక్రందనాలతో గతించిపోయిన "ఆరేండ్ల స్వతంత్రంలో"

స్థలం: గుమాస్తా యిల్లు. షాహుకారు కంపెనీ.

# కృతజ్ఞత.

ఈ "ఇదా స్వతంత్రం?" నాటకం ది 16-8-52 న రాజమండ్రి టౌన్‌హాలులోనూ, 30, 31, 1 తేదీల్లో ఏలూరు "కేపిటల్‌హాలు"లో ప్రపంచప్రఖ్యాత మహాకవి శ్రీ హరీంద్రనాథ్ చటోపాధ్యాయిగారి అధ్యక్షతను జరిగిన శాంతిసాధనకోసం-ఆంధ్రరాష్ట్ర సాంస్కృతిక మహాసభ వైజ్ఞానికోత్సవాల్లో ది 31-8-52 నాటకప్రదర్శనల్లో ప్రదర్శించి శాంతిప్రియుల, అభ్యుదయకాముకుల, కళాకారులమధ్య నాకు సముచితస్థానాన్ని లభింపజేసిన నా మిత్రబృందానికి సదా కృతజ్ఞుడ్ని.

## నాటి నటవర్గం.

| | | |
|---|---|---|
| శేఖర్ | — | కార్మికుడు, కార్మికనాయకుడు |
| బాలకృష్ణ | — | మార్వాడీ. |
| పేరయ్య | — | సాహుకారు. |
| పడాల రామారావు | — | గుమాస్తా, కవి. |
| కుమారి లక్ష్మి | — | " " భార్య. |

## మ్యూజిక్ :

శ్రీ గంగరాజు, సత్యం, పల్లారావు, చిట్టిబాబు గార్లు.

# ఇదా స్వతంత్రం?

## ఒకటో రంగం

[భూషణం యిల్లు. వూయల, మంచం వుంటాయి. గోడకు నల దమయంతుల ఫొటో వుంటుంది. ఉమ—గుమాస్తాభార్య ఏడుస్తున్న పాపను లాలిస్తూ వస్తుంది.]

వుమ : (ప్రవేశించి) అమ్మమ్మమ్మ! కొరుక్కుతింటున్నావే! (పాప తల్లి గుండె బాదుతుంది) వస్తుల్లో పాలెలా వస్తాయమ్మా? (పడుకోబెడుతూ) పడుకోవే తల్లీ!....జో ....లాలీ! (మళ్ళీ ఎత్తుకొని) అబ్బబ్బబ్బ! పీక పిసికేస్తాను చూడు! (అని పిసికేయబోతే—పాప ఏడుస్తుంది) అయ్యొయ్యొయ్యో! లేదమ్మా! లేదు; చూడు! నాన్న పాలడబ్బా తెస్తున్నారు! (పడుకోబెడుతూ) పడుకోమ్మా, పడుకో!....

....లాలీ (ఊయల ఊపుతూ)

ఏడవకు ఏడవకు।
ఏడవకు మాపాప!
ఏడిస్తె మాంచాలి
వెక్కిరిస్తుందేమొ ॥జో॥
ప్రణయతంత్రులుగాక
శౌర్యతంత్రులు మీటి
మగని పొంగించెనే

పగువ మాంచాలి—
రణమునకు దూకించెనే।
ఏడవకు ఏడవకు।
ఏడవకు మా పాప॥
తెలుగు మగువల
బాట - తొలగకూడనిదే॥ జో॥

(పాప ఏడవగా) అబ్బ! నీతో పడలేకపోతున్నానే. (విసుగ్గా ఎత్తుకుంటుంది)

భూషణం: ("ఆరేండ్ల స్వతంత్రంలో" అన్న వ్రాత నాటకప్రతితో ప్రవేశించి) అహ్హాహ్హాహ్హా! అహ్హాహ్హాహ్హా!

వృమ : ఏమిటీ వికటం?

భూష: అహ్హాహ్హాహ్హా! (ఎదుటికి తిరిగి) ఇంకా దొడ్డిత్రోవనే ఉంది పిచ్చిది!

వృమ : పాలులేక పా పేడుస్తుంటే మీ రానందిస్తున్నారా?

భూష: అరె! నీ కింకా తెలీదన్నమాట! పాలిచ్చే చెప్తే దిగుతూంటేనూ!

వృమ : చాల్లెండీ మిట్టవేదాంతం! ముందు పాలడబ్బా సంగతేం జేశారో చెప్పండి?

భూష: అదుగో! మళ్ళీ పాలంటావే! పోనీ మన పెద్దలు చెబుతూన్నట్టు సంతానవిరోధం చేస్తే? (ఆగి) ఆ! అసలు పిల్లల గొడవే వుండదుగా?

వృమ : (ఆశ్చర్యంగా భూషణంముఖంలోకి చూస్తూంటుంది.)

భూష: (వుమనువూపి) ఆఁ, ఏమంటావ్?....ఓ!....అలా చెప్పు. పుట్టినోళ్ళ నేం చేయాలనా—నీ సందేహం? ప్చ్, ప్చ్, ప్చ్, నువ్వొట్టి వెర్రిబాగులదానివి వుమా! సృష్టించారుగా పిల్లలకు పాల కరువు, పెద్దలకు తిండికరువూను! బస్! యిక పుట్టబోయేవాడు పుట్టడు; పుట్టినోడు బ్రతకడు.

వుమ: అదేంటండీ? మీ ముఖం కళతప్పుతోంది?

భూష: ఏమిటీ?

వుమ: (విచారంగా) మీ ముఖం కళతప్పుతోంది.

భూష: కళా! కళ! నా గుమాస్తాపని పోయి పది మాసాలైంది. కడుపు చేత్తో పట్టుకు తిరుగుతున్నా కనికారం లేదీ లోకానికి!

వుమ: మరి మీరు రాసిన నాటకం పాలడబ్బా విలువకైనా అమ్మెస్తానని వెళ్లారుగా?

భూష: ఆ!.....కాని.....కురుక్షేత్రంలాంటి కిరాయి నాటకాలకు కాసులు కురిపిస్తున్న యీ లోకంలో, కష్టజీవుల కన్నీటి గాథలు వినేవా డెవడు? కొనేవా డెవడు? యీ నాటకం చూసిన ప్రతి పబ్లిషరూ మొండిచెయ్యి చూపాడు....ఇక పనీ వద్దు! కవిత్వమూ వద్దు! (వుద్రేకంతో పుస్తకం చింపి పారేస్తాడు. అది వూయలలో పడుతుంది. పాప కెవ్వుమంటుంది.)

వుమ: అయ్యో తల్లీ! (పిల్ల నెత్తుకొని) ఇక వుద్రేకానికి అంతూ పంతూ లేదేమిటి?

భూష: అన్నీ అంతమైపోతాయ్; పదండి.

వుమ: ఎక్కడికి?

భూష: గోదావరికి!—చావడానికే, చావడానికి. (ఉమను పట్టుకొని) ఏం? చావంటే భయమేస్తోందా? ఇలా కుళ్లికుళ్లి చావడానికి భయంలేదేం?

వుమ: ఏమిటండీ సంధిమాటలు?

భూష: పోనీలే, నీ వీ త్రిశంకుస్వర్గంలో నీ పిల్లతో వుట్టికట్టి కూగు; నేను పోతా. (వెళ్ళిపోబోతాడు)

వుమ: (పిల్లను వూయల్లో వేసి భర్తను పట్టుకొని) ఆగండి, చస్తే అంతా చద్దాం.

భూష: న న్నాపకు. (మంచంపైకి త్రోచేసి పోతాడు. వుమ కెవ్వుమంటుంది.)

నర్స్: ("చకో"మని ప్రవేశించి) ఆగరా, భూషణం!

వుమ: (దివాలున లేచి) ఆయన్నాపన్నయ్యా!

నర్స్: మరేం పర్వాలేదు! వీ డెక్కడికి పోతాడమ్మా?

భూష: ఒరేయ్ నర్స్! నీవెంత కార్మికనాయకుడవైనా న న్నాపకు.

నర్స్: నే నాపుతాను! ఒక మంత్రి చచ్చినా పర్వాలేదు!....కవి మాత్రం చావకూడదురా!

భూష: నీవు చావకూడదన్న కవిని నేనుకాదురా! నన్ను పోనియ్!

వుమ: (పాపను వుయ్యాల్లోవేసి, భూషణాన్ని పట్టుకొని) మీరు వెళ్ళడానికి వీల్లేదు!

నర్స్: (ఇంకోవైపున పట్టుకొని) అవును, వీల్లేదు.

ఘోష: అయితే మీ రిద్దరూకలసి న న్నిక్కడే చంపెయ్యండి.

(కూలబడతాడు)

నర్స్ : (ఘోషణాన్ని మంచంమీద కూర్చోబెట్టి) ఒరేయ్! ఇంత ఆవేశం కార్యదక్షతకు లక్షణం కాదురా!

ఘోష: ఆవేశం! నా గుమాస్తాపని తీసేసిన షావుకారూ ఆవేశ మన్నాడు! నాటకం కొనమన్న పబ్లిషరూ ఆవేశమన్నాడు. యీ నా వుమా—ఆవేశమంది. అన్నీ తెలిసిన నీవూ అదే పాటా!

నర్స్ : ఆ ఆవేశమేనా నిన్ను ఆత్మహత్యకు పురిగొల్పింది! ఏదైనా వెర్రితలలు వేసేంతవరకూ రాకూడదురా!.... ఏదమ్మా! వీడి నాటకం ఏదీ?

వుమ : (చిరిగిపోయిన నాటకప్రతి తీసిచ్చి) ఇదిగో అన్నయ్యా!

నర్స్ : ఇదేమిట్రా! ఇలా చింపేశావ్? ఎంత ఆవేశమైనా కూర్చున్న కొమ్మనే ఎవడన్నా నరుక్కుంటాడ్రా? (పుస్తకంపేరు చూసి) "ఆరేండ్ల స్వతంత్రంలో".... హుం, పేరులోనే ఆవేశం!

ఘోష: అవును; యీ "ఆరేండ్ల స్వతంత్రంలో"ని కుళ్ళును కెలికి బయటపెట్టాలనే దాని మేలిముసుగు లాగేశా!

నర్స్ : ముసుగులాగి కుళ్లు చూపితే చాలదురా! కవన్నవాడు ఆ కుళ్ళును కడిగేమార్గం చూపాలి. ఆ మార్గం బహుజన సమ్మతంగా ఉండాలి అప్పుడే కవి సమాజానికి జీవనాడి

కాగలుగుతాడు. అందుకే కవిని "మానవ మనోశిల్పి" అన్నారు.

భూష: అంటే?

నర్స్: ఇదిగో చూడు! (నాటకం చూపుతూ) నీ వెలా సమాప్తం చేశావో! ఆ కుట్రకు కారకుడు వర్తకుడని చూపావ్. ఆ వర్తకునిపై గుమాస్తాను, కార్మికుణ్ణి సాహస కృత్యానికి పురికొల్పావ్. అందుకే నీ నాటకం ప్రజాదరణ కోల్పోయింది!

భూష: ఆఁ!....

నర్స్: ఆ యేమిట్రా? కవివాక్యాలు కావ్యాలకు దారితీస్తాయి. అందుచేతే ఒకటి చెప్పేముందు బాగా ఆలోచించాలి. చూడు, నీ వా పొరపాటు చేయబట్టేనా, నిరుత్సాహం చెంది ఆఖరికి మధురమైన జీవితాన్ని ఆత్మహత్యవరకు తెచ్చావ్! అసలు కార్మికుల, గుమాస్తాల నిరుద్యోగంతో పాటు షాహుకార్లు దివాళాలుతీస్తున్నారనేది కూడా గుర్తించాలి.

భూష: గుర్తిస్తే?

నర్స్: అప్పుడు తెలుస్తుం దీ కుట్రకు కారకు లెవరో?

భూష: ఎవరంటావ్?

నర్స్: అందుకే అనుభవంతోపాటు సిద్ధాంతజ్ఞానంకూడా కావాలి. కవి కప్పడిన సత్యాన్ని బయటకు లాగాలి.

భూష: ఏం టా సత్యం?

నర్స్ : అదిగో! నాటకానికి అక్కడే ఉంది Suspense. అది సృష్టించగలిగితేనే ప్రేక్షకుడు కవితోపాటు వొద్దన్నా వస్తాడు....అప్పుడు కవి ఆ సత్యాన్ని చూపి ప్రేక్షకుడిని భవిష్యత్తుకు కదంత్రొక్కించాలి.

భూష: ఆ Suspense ఏమిటో త్వరగా చెపుదూ?

నర్స్ : చెబుతా; ఆనక ఆఫీసుకు రా.—నా కిప్పుడు పనుంది.

భూష: ఇంతకీ ఇప్పు డేం చెయ్యమన్నావ్?

వుమ : ఏంచేస్తావో అన్నయ్యా! యీాయనపని పోయి పదిమాసా లైంది. అప్పులు, పస్తులతో చస్తున్నాం!

నర్స్ : మరేంపర్వాలేదమ్మా! ఒరేయ్ భూషణం! నీవు కథమరుగున పెట్టిన మార్వాడీని పైకిలాగి నేను చెప్పిన వెలుతురులో నాటకం ఎత్తి రాయి. నాటకంపేరు మాత్రం "ఇదా స్వతంత్రం?" అని ముచ్చటగా మార్చి, ఇక సమాప్తం బహుజన రంజకం చెయ్!

వుమ : చేస్తే?

నర్స్ : చేస్తే—ప్రజలు భూషణాన్ని మహాకవిని చేస్తారమ్మా!

భూష: మెచ్చి—మేకతోలు కప్పుతారంటావ్! అది నా కెందుకు? ముందు........

నర్స్ : ముందూలేదు, వెనుకాలేదు, నీ వలా రాసెయ్! యీా నాటకం యీా వూళ్ళోనే ప్రదర్శిద్దాం.

భూష: చాలు, చాలు, బాబూ చాలు! యీా బాధలు చాలు. మళ్ళీ యీా నటవర్గాలతో నానా బాధలు తెచ్చిపెట్టకు.

నర్స్ : తెచ్చిపెట్టేదేముంది? నాటకం అంతా ఐధువేషాలేగా! అంతకీ కాకపోతే కార్మికునిపాత్ర నేను ధరిస్తాను. గుమాస్తా నువ్వు వెయ్.

భూష! చచ్చేంరా నాయనా!

నర్స్ : ఏడిశావ్! ఒరేయ్, ఇదంతా నీ వాస్తవిక జీవితనాటకంరా. అందులోనూ బాధపడేవాడే బ్రహ్మాండంగా నటించ గలడుకూడా. మరేం పర్వాలేదు. రిహార్సల్సులో లోపాలు సరిచేసుకుందాం.

భూష: మరి మిగతా ముగ్గురు?

నర్సు: వుమ శారదపాత్ర ధరిస్తుంది.

వుమ : (సిగ్గుతో) ఆఖరికి నాటకాల్లో దిగాలన్నమాట?

నర్సు: ఆదేంటమ్మా! జీవితమే నాటకం. చూడు! పృథ్వీరాజ్ కుటుంబం!

భూష: అవును వుమా! యీ వేషం నీవే వేయాలి! గుమాస్తా గుమాస్తాయే! గుమాస్తాభార్య గుమాస్తాభార్యే! ....ఇక నాటకం చూచుకో!....అయితే మిగతా వేషాలు?

నర్సు: నే చూస్తాగా!

భూష: అయితే యీ నెలలోనే నాటకమాడేయాలి.

నర్సు: నీ ఆలస్యమే! నీవు నాటకం సిద్ధంచేస్తే రిహార్సల్సు మొదలెడదాం....తరువాత నాటకప్రదర్శనే! సరే! నే నెళ్లొస్తా! కార్మికుల నడిగి ఏదో కాస్త డబ్బు పంపుతాలే.

భూష: (నర్స్ చేయి పట్టుకొని) నీ మేలు మరువలేనురా నర్స్!

నర్స్: నన్ను స్తుతించకు. అసలు నన్నిక్కడకు పంపించిత కార్మికులే తెలుసా?

ఘూష: ఆహా!

నర్స్: అదీగాక సాటివాడికి సాయం చేయనోడు—మానవుడే నంటావా?

భూష: ఏం చేసినా కార్మికులేరా. వారికి నా అభివందనాలని చెప్పరా.

నర్సు: అలాగే! (వుమతో) వస్తానమ్మా!

వుమ: వది న్నొకసారి పంపన్నయ్యా! చూచిపోతుంది.

నర్సు: ఎందుకులే వుమా! "మాలపిల్లను రప్పించార"ని మిమ్మల్ని వీధి పెద్దలు వెలేస్తారు.

వుమ: ఆఁ, పెద్దలకేంలే. అదీగాక మనసుకు మాలేం టన్నయ్యా?

నర్స్: అయితే పంపుతాలే.....వస్తా....(వెళ్ళిపోతాడు)

వుమ: (అటు చూస్తూ) కారుచీకట్లో కాంతిరేఖలా వచ్చాడు.

ఘూష: (వుమ భుజంపై చెయ్యేసి) అంతేనా, క్రాంతిజ్యోతిలా వచ్చాడు....

వుమ: కాంతిరేఖలా వచ్చాడు.

ఘూష: క్రాంతిజ్యోతిలా వచ్చాడు.

వుమ: కాంతిరేఖ!

ఘూష: క్రాంతిజ్యోతి!

వుమ: కాంతిరేఖ!



ఘూష: క్రాంతిజ్యోతి! (నంజు వస్తుంది. ఆపాదమస్తకం కంపిస్తాడు.)

వుమ: (వెనక్కి చూచి భూషణాన్ని పట్టుకొని సపర్య చేసి) మాయనంజురోగం మళ్ళీ దాపురించింది. (మంచంపై కూర్చోబెట్టి కాళ్ళురాస్తూ) ఇదీ జీవితం! క్షణానికి సంతోషం! క్షణానికి విచారం! ఆఖరికి నీటిబుడగకంటె అల్పమైపోయిందీ జీవితం! (ఘూషణాన్ని లేపి) పదండి ... లోపలికి.

ఘూష: వుమా....(కంపిస్తూనే వుమతో నడుస్తాడు)

[తెర జారుతుండగా నేపథ్యంలో పాట]

కాలమూ—కలికాలములో
ఈ మనుషులూ—
గానుగలో నువ్వులేనా?
పిండేసిరి—పడుచుదనమూ
పీల్చేసిరి—మూలుగులనూ
పారేసిరి—రోడ్లమీదా
గుండెలు, నరాలు నమిలివేసిరి
కాలమూ—కలికాలమూ
మనుషులూ—
గానుగలో నువ్వులేనా?

[తెర]



# ఇదా స్వతంత్రం?

## రెండో రంగం

[నేపథ్యంలో మూడుగంటలు వినపడినతర్వాత ప్రార్థన ప్రారంభం.]

స్వాగతం——
సుస్వాగతం——
శ్రామిక జనావళి
కవోష్ణ రుధిర
గేయం——మా ధ్యేయం
స్వాగతం
సుస్వాగతం!—

[అంతా "వర్కర్సు అర్జుఫియేటరుకీ జై" అంటారు. నేపథ్యంలో "ఇక చూడండి! ఇదే ఇదా స్వతంత్రం? ఇదా స్వతంత్రం?? ఇదా స్వతంత్రం???" తాళవాయిద్యం. తెరలేస్తుంది. సత్యం ఇల్లు. రాత్రి పదకొండయింది. ఒకప్రక్క డెస్కుపై కొవ్వొత్తి వెలుగుతుంటుంది. మంచం, నలదమయంతుల బొమ్మ వుంటాయి. శారద నిర్వేదంతో పాడుతూ ప్రవేశం.]

శారద : మా తెలుగుతల్లిరో
ఓ దయాసింధురో
ఈ కటికదారిద్ర్య

కారుచీకటిలోన
నీ కనుల కాంతులను
కురిపించవోయమ్మ
కురిపించవోయమ్మ
కురిపించవో..........

[పాడుతూ శారద కంపిస్తుంది. సత్యం అవజ్ఞాలతో ప్రవేశించి తూలిపోయి అవజ్ఞాలు క్రింద పడిపోగా ఒక్కొక్కటి ఏరబోతాడు.]

శార : అయ్యో! (తనుకూడ ఏరి దస్కుపైన పెట్టి, భర్తను మంచంపై కూర్చుండబెట్టి) అయ్యోరాత! రావడమే పద కొండయితే మళ్ళీ యీ అవజ్ఞాలతో పనా?

సత్యం: అవ్వే! రేపు ఇన్‌కంటాక్సువాయిదా! మన ధర్మాన్ని మనం నిర్వర్తించాలిగా! అందుకు కష్టపడొచ్చా!

శార : శక్తికి మించిన కష్టమా?

సత్యం: నా కష్టాని కేమొచ్చెలే! నీవుమాత్రం కష్టపడకూడదు. పోయి పడుకో.

శార : యీ పూట మీకోసం అప్పుచేసి అరసోలెడు గింజ లుడికించా; లేచి భోజనం చేయండి!

సత్యం: అయితే నీవు భోజనం చెయ్యలేదన్నమాట.?

శార : మీకంటేనా? నేను....

సత్యం: ముందు కొన్ని మంచినీళ్లందుకో!

శార : ఇప్పుడు మంచినీళ్ళేమిటి? లేచి భోజనంచేయండి!

సత్యం: హుః మంచినీళ్ళంటే అంత తేలికా? "నీరం నారాయణ స్వరూపం" అన్నారు తెలుసా? అందులోనూ ఆకలి జీవులకు మంచినీళ్లే వుపాది శారదా!....చే! వెళ్లి తీసుకురా!

శార : భోజనంలేకుండా ఒట్టినీళ్ళతో వుంటారా?

సత్యం: నే నెలావున్నా పర్వాలేదు—నీవుమాత్రం తిండి తినితీరాలి!

శార : మిమ్మల్ని పస్తెట్టా? అలా జరక్కూడదు!

సత్యం: పోనీలే, పద! చెరిసగం తిందాం!

శార : అరసోనెడులో మళ్ళీ అర నాకా?

సత్యం: అమాయకురాలా! కష్టాలను, సుఖాలను పంచుకోవడం లోనేవుంది—దాంపత్యజీవిత సుఖం! చూడు! ఆ నల దమయంతుల్ని, ఎంత అరమరికల్లేని జీవితం! చూశావా? ....

ఇకపద, పద శారదా! (అని బలవంతంగా తీసికెళ్లి ఇంకో నిమిషానికి మంచినీళ్లు తాగుతూ వచ్చి) ఒక నూత్నమానవుడ్ని కడుపులో మోస్తున్న మాతృమూర్తికి పిడికెడు కబళం పెట్టలేని పాడు గుమాస్తానయ్యా. (కూర్చొని ఆవర్జాలు తెరిచి వ్రాస్తూంటాడు.)

శార : (భోజనంచేసొచ్చి చీరచెంగుతో మూతి తుడుచుకుంటూ ప్రవేశించి) ఇక పడుకోండి.

సత్యం: (మాట్లాడబోతూండగా "నంజు" వచ్చి ఆవర్జాలపై పడిపోతాడు.)

శార : (సత్యాన్ని లేవనెత్తి మంచంపై కూర్చోబెడుతూ) మాయదారి సంజురోగం, మనకే దాపురించాలి!
(చేతులు రాస్తుంది.)

సత్యం: (వొణుకుతూ) పిచ్చిదానా! డబ్బున్నోడింటి కెడితే బంగారపువెస్పుతో కొడతాడు....అస లీ రోగం వాళ్ళకు మ్మం ఎందుకు త్రొక్కుతుంది? (నిరాశతో) అన్ని రోగాలకూ ఇలా కొవ్వొత్తిలా కరిగిపోతున్న మనలాంటి అభాగ్య జీవితాలే ఆతిథ్య మిస్తాయ్!........(మరింత వొణికెక్కువై పడిపోతాడు. శారద పరిచర్య చేస్తూంటుంది.)

శార : (తలనిమురుతూ నెరసిన వెంట్రుక చూచి) ఆ! ఇదేమిటి! పాతికేండ్లు దాటని మీ తలలో అప్పుడే తెల్లవెంట్రుకా?

సత్యం: ఎందుకంతాశ్చర్యం? వయస్సు పండకపోయినా, కష్టాల్లో పండినోడి ప్రతి తలలోనూ తెల్లవెంట్రుకలు దొరుకుతాయ్! నరాలలో నిస్సత్తువే వచ్చినప్పుడు తలలో వెంట్రుకలకా ఆశ్చర్యం? శారదా!....మన జీవితమే పండిపోయింది!....

శార : (సత్యం కాళ్ళమీదికి జారి) ఇలా చూడండి (ముఖమెత్తి కన్నీరు తుడుస్తూ) ఒకప్పుడు నా కళ్ళల్లోకి ఆశారేఖల్ని వెదజల్లిన మీ కళ్ళలోనా కన్నీరు? మరచిపోయారా? మన పెండ్లినాటిరేయి మీ రన్నమాటలు? (లేచి కొత్త ముందుకెడుతూ) ఆనాడు వసంతశోభలో నేను వీణ మీటుతుంటే మీరు కిటికీ తలుపులు తెరచి, ఆ చల్లని

చంద్రకాంతిలో ఎన్నెన్ని ఆశలు రేకెత్తించారో, నన్ను పిలచి ఎంతటి విశ్వాసంతో మీ హృదయానికి హత్తుకున్నారో? (సత్యంకాళ్ళమీద వాలంగి) మరచి పోయారా?

సత్యం: (శారద తలనిమురుతూ) లేదు శారదా, లేదు! నాటి మన వసంతంలోని వివాహోత్సవంతోపాటు దేశంలో స్వతంత్రోత్సవంకూడా జరిగింది. దానితో మన జీవితం కూడ మొగ్గలు తొడిగి, మూడుపూవు లారుకాయలుగా శోభిస్తుం దని నమ్మా! కాని....కాని (లేచిముందుకెళ్ళి వాలుకుతూ) మన జీవితంలో రెండు నెలలయినా తిరక్కుండానే మనలను మాడ్చేసే గ్రీష్మం ప్రవేశించింది. తరువాత మనలను తరిమి తరిమి మంచుముక్కలతో కొట్టి వేధించుకు తినే చలికాలం దాపురించింది. ఇక మనమాశించిన సుఖానికి బదులు నిరంతర దుఃఖమే ప్రధానమై పోయింది....శారదా! క్షమించు. నీలో లేనిపోని ఆశలు రేకెత్తించి దగాచేసినందుకు క్షమించు శారదా! (శారద చేతుల్లో తల పెడతాడు)

శార : సత్యం తల నెత్తుతూ) అలా అనకండి! విచారించకండి. చలికాలం గతించిన రెండు నెలలకే మళ్ళీ శరచ్చంద్రుడు ప్రకాశిస్తాడు. తరువాత మళ్ళీ వసంతం వస్తుంది. మన జీవితం సుఖమయమవుతుంది........

సత్యం: సుఖం! సుఖం—చచ్చిపోయింది శారదా! ఇక మనం కుడితిలో పడి కొట్టుకునే ఎలుకలమే! (ఆయాసంతో మంచంపై వాలి మోకాళ్ళల్లో ముఖం పెట్టుకుంటాడు)

శార : వుండండి, మంచినీళ్ళు తెస్తా! (అని వెడుతుంది)

[బయట "ధన్, ధన్" మని తలుపు శబ్దం. మంచినీళ్ళతో ప్రవేశించిన శారద చేతులోని గ్లాసు పడిపోతుంది. సత్యం "చక్" మని తలెత్తి చూస్తాడు. మళ్ళీ బయట శబ్దం.]

శార : ఈ అర్ధరాత్రి ఎవరా చప్పుడుచేసేది?

సత్యం: వెళ్ళి చూడు.

శార : (వెళ్ళి తలుపుతీసొచ్చి) మీ పోతమేస్త్రీ ముత్యాలు.

సత్యం: చంపాడు. ఇంకా ఎవరో అనుకున్నా.

ముత్యా: (ప్రవేశించి) నేను. సత్యంగారూ. సరేగాని ఆ నంజు రోగం ఏమైనా కుదుటబడ్డట్టేనా?

శార : మనిషిని మరీ నమిలేస్తోంది ముత్యాలూ!

ముత్యా: యీ వెధవజబ్బు లున్నాయే, వీటి తస్సాదియ్యా! మందు గాని వాడకపోతే మరీ నమిలేస్తాయ్!

శార : ఏది ముత్యాలూ! యీ నెలజీతం నలభై అప్పులు తీర్చడానికే సరిపోయాయ్! ఇంకా ఇంటిఅద్దెవాడు వేపుకుతింటున్నాడు....జరిగే నెలంతా పస్తుల్లాగే కనబడుతోంది.

ముత్యా: మీ బాధ వింటే నాకు కడుపు తరుక్కుపోతోంది! మేమెలాగో ఏడుస్తాం. మీ కెలా కుదురుతుందంట! అందుకే సత్యంగారి చెవి నిల్లుకట్టుకొని పోరాడుతున్నా! ఎప్పుడూ

షావుకారు మే లంటాడు.....నువ్వు చెప్పమ్మా! మనం బ్రతకాలని కోరుకోవడం షావుకారు చావాలనడమంటావా?

సత్యం: (లేచి) ముత్యాలూ! షావుకార్ల స్థితి మనకంటె అధ్వాన్నంగా వుంది. మన కంపెనీ చూడు, ఒకప్పుడు వారం రోజుల పనితో ఎంత కోలాహలంగా కళకళలాడుతూ వుండేది? ఇప్పు డెంత కళావిహీనంగా వుందో! చూడు. వారానికి రెండురోజులన్నా పనుందీ? ఇంకా నయం; మన తెలుగుదేశంలో దివాళాలెత్తిన కంపెనీలు, నిరుద్యోగులైన పనోళ్లు వేలూ, లక్షలూను!

ముత్యా: అదీ మనలోటే నేంటి?

సత్యం: అదిగో! అక్కడే వుంది—వ్యవహారం! అల్యూమినియం అమెరికావాళ్ళనుండి మనదేశంలో గుజరాతీ కోటీశ్వరుల కొస్తుంది. వీళ్ళు హైరేటు పెట్టేస్తారు. మన షావుకారు అంత హైరేటులో కొని కంపెనీ ఎలా సాగిస్తాడు? ఇక్కడ చూస్తే కొనేవాడు కనబడడు. నీవే చెప్పు, మనమైనా (ప్రక్కకు వెళ్ళి) కాస్త ముందూ వెనుకా, మంచీ చెడ్డా ఆలోచించాలంటావా లేదా?

ముత్యా: దీనికి మనమేం చేస్తామంట. ఆ కోటీశ్వరులపైన పడాల్సింది—షావుకార్లు. ఏమిటో గుమాస్తాగారూ! మీరు షావుకార్లను ఇలా తనుత్తారుగాని, వాళ్ళు కూలోడినేమైనా తనుత్తారంటారా? గత ఏడాది మీ రేమన్నారు?

సత్యం: (దగ్గరకొచ్చి) ఏమన్నాను?

ముత్యా: షావుకారు ఒక్క ఏోతసరుకుకే పదివేలు లాభం పొందా డన్నారా?

సత్యం: వూ, అన్నాను.

ముత్యా: (కోపంతో) లాభాలు వాళ్ళకా? నోట మట్టికొట్టుకు పోయేది మనమా? ఏమైనా గుమాస్తాగారూ! గంజిలోకి ఉప్పులేక చచ్చేది మనం! పెళ్ళాల మెడల్లోకి వస్తువు ల్లేవని ఏడ్చేది వాళ్ళా.........

శార : ఏమైనా అడిగితేనేగావి, అమ్మైనా పెట్టదు.........

ముత్యా: మనం వీళ్ళపై పడితే, వీ ళ్లా కోటీశ్వరులపై పడతారు. ధరల కంట్రోలే వస్తే అసలు రోగమే కుదురుతుంది.

సత్యం: ఇంతకీ ఏమంటావోయ్?

ముత్యా: ఏమంటానా? ఇంకా అలా అడుగుతారేంటంట! మీ గుమాస్తాలు, మా కూలీలం ఏకమైతే, హే! నాసామి రంగా! కొండమీది కోతి దిగిరాదటయ్యా!

సత్యం: సరే, ఏం చేద్దామంటావ్?

ముత్యా: మేం రేపు ఆదివారం జీతంతోశలవును గురించీ, కూలెక్కు వచేయడాన్ని గురించి అడుగుతాం....మీరూ జీతం ఎక్కు వడిగితే సరి!

శార : అవును, అందరూ ఏకమైతే షావుకా రొప్పుకోవచ్చు కూడాను.........

సత్యం: అలాగే కానియ్యవోయ్!

ముత్యా: అలాగే అంటే కాదు—తప్పకుండా అడగాలి.

సత్యం: తప్పకుండా అడుగుతాను.

ముత్యా: సెభాష్! ఇంక గెలుపు మందే! (అని హుషారుగా తల పని తలంపుగా సత్యాన్ని చరిచి) మ రెళ్ళొస్తానమ్మా (వెళ్ళిపోతాడు. శారద తలుపేయడాని కెళుతుంది.)

సత్యం: (మంచంమీదినుంచి లేచి ఆలోచనానిమగ్నుడై) ఏమిటో, ఇదంతా? షావుకార్ని మంచి చేసుకుని, ఏదైనా సాధించాలి గాని, ఇలా సూటిగా పోతే!....(అని తిరుగుతుంటాడు. మేఘాచ్ఛన్నమైన ఆకాశాన్ని చూచి కంగారుపడుతూంటాడు.)

శార : (తలుపేసొచ్చి) ఎప్పుడూ ఆలోచనా, వ్రాతే నేమిటి? యిక పడుకోండి. చాలా రాత్రైపోయింది. (అంటూ ఒత్తి డిచేస్తుంది. సత్యం ఒకడుగు ముందుకేసి వెనక్కి జంకి ఆకాశంవైపు చూస్తాడు.)

సత్యం: (కంగారుగా) ఆకాశాన్ని మేఘాలుక్రమ్మేశాయి ఏమో.... అదిగో (దుమ్ముగాలి వస్తుంది) గాలి దుమారం! శారదా మంచం లోపలెయ్! (శారద మంచాన్ని లోపలకు తీసుకెళుతుంది) ఏమో....ఏం జరగబోతోందో! ........(అంటూ వెళ్ళిపోతాడు)

[ తెర ]

# ఇదా స్వతంత్రం?

## మూడో రంగం

[రంగయ్యగారి అల్యూమినియం కంపెనీ. లోపల వర్కుషాపు, బయట ఆఫీసు. లక్ష్మి, తిరుపతి వెంకటేశ్వర్లు, వినాయకుని బొమ్మలుంటాయి. కాటా, గల్లాపెట్టె, డెస్కు, పీటా, లెక్కలపుస్తకాలు వుంటాయి. నేపథ్యంలో మట్టిన మోతలు వినబడుతుంటాయి.]

రంగ : (ప్రవేశించి క్రిందచూచి, కోపంతో) శుచీ, శుభ్రంలేని శుంఠలు! యీ కాస్త వూడ్చి, పని మొదలెట్టకూడదూ?.... (ఎదుటికి చూచి) ఒరేయ్! ఎవర్రా అక్కడ? (ముత్యాలు వస్తాడు) ఏం? నీ వొచ్చావేం? ఇంకా పోత మొదలెట్ట లేదూ?

ముత్యా: కుర్రాళ్లు పనిలో సర్దుకున్నారు. ఇక కొలిమికి మూసె క్కించడమే తరువాయి.

రంగ : పనిచేయడమేకాని, పరిశుభ్రం లేదన్నమాట! చూడు, అస లూడ్చారేమో?

ముత్యా: నే నూడ్చేస్తారెండి. (చీపురు తీసుకొని వూడుస్తాడు)

రంగ : చాల్లే, కాస్త నిప్పు పట్టుకురా!

ముత్యా: (తెస్తాడు. రంగయ్య సాంబ్రాణి ధూపం వేస్తుంటాడు)

[ముత్యాలు ధూపంవేస్తున్న రంగయ్యను చూస్తూ పెదవి విరుస్తాడు.]

రంగ : (ముత్యాలు పెదవివిరుపు చూచి) ఏంటా వెకిలిమూపు?

ముత్యా: అబ్బె! యీ ధూపాలూ.... దీపాలు....?

రంగ : ఆపువెయ్! మీకు ధూప, దీపా లెందుకు, చేతిలో నాలుగు పిక్కలుంటే చాలు........

ముత్యా: రంగయ్యగారూ! నాలుగు పిక్కలుంటేనేగా కడుపులోకి గంజి. ఆ గంజీ లేకపోతే యీ........

రంగ : సరేలే! ఇది తీసుకెళ్లు (ముత్యాలు నిష్క్రమిస్తాడు.) రంగయ్య బొమ్మలకు దండలుకట్టి అగరొత్తులు వెలిగిస్తాడు. ఆ పని చేస్తున్నప్పుడు "శ్రీ లక్ష్మీనారాయణాయ నమః....విఘ్నేశ్వరాయనమః" అనుకుంటాడు. లోపల మట్టినమోత ఆగిపోతుంది. అలజడి) అరె, మట్టిన ఆపు చేశారే?

ముత్యా: (కంగారుగా ప్రవేశించి) రంగయ్యగారూ! రంగయ్యగారూ! మూస పగిలిపోయింది....

రంగ : మూసే! ఉదయాన్నే! మూసకీ, సరుక్కీ పాతిక రూపాయలు నష్టమన్నమాట?

ముత్యా: (కోపంగా) సొమ్ము! సొమ్మునష్టాన్ని చూస్తున్నారా?.... కుర్రోడికళ్ళు పేలిపోయాయ్! ఒళ్లు కాలిపోయింది.... యిక వాడి బ్రతుకు....

రంగ: బ్రతుకు! కరగడంవద్ద ఎంత జాగ్రత్తగా వుండాలో యిప్పుడు తెలుస్తుంది.

ముత్యా: పుండుపై కారం జల్లకండి. వెంటనే ఆస్పత్రికి రండి, యిండీషను చేయించకపోతే కుర్రోడు నిష్కారణంగా చచ్చిపోతాడు.

రంగ: మీరు పొగరెక్కి ప్రాణంమీదికి తెచ్చుకుంటే నే నేం జేస్తాను?

ముత్యా: ఘోరంగా మాట్లాడేస్తున్నారు?

రంగ: ఘోరం! ఘోరం మీది! నా మూసా సరుకు, పోతే నాకు బాధ కాదూ?

ముత్యా: నే నెన్నోసార్లు చెప్పా ధరతక్కువని యీ పగిలి పోయే మూసలు కొనవద్దని. (వెనక్కిచూచి లోపల గోల విని) ముందు బండెక్కించి ఆస్పత్రికి తీసుకు పదండిరా! నే నిప్పుడే వస్తున్నా (రంగయ్యతో) పోనీ యేమైనా అడ్వాన్సు యివ్వండి.

రంగ: వెళ్లెళ్లు; ఇక వేషాలేయకు.

ముత్యా: వేషమా! అవునులెండి, ఎద్దుపుండు కాకికి సరదా.

రంగ: ఊఁ, వెళ్లదూ.

ముత్యా: సరే వెస్తున్నా! లేకపోతే కుర్రోడు చచ్చిపోతాడు. (వెళతాడు)

రంగ: అపశకునం! చేరాల్లేక మే మేడుస్తుంటే మాకుపడి పీక్కు. (రేష్‌పెట్టివద్ద కూర్చుంటూ) ఇన్‌కంటాక్సు వాయిదా

వుందని తెలిసికూడ గుమాస్తా యింకా రాలేదు. యింతకే దరిద్రం మా నెత్తెక్కి తొక్కుతూంటే వీళ్ళనని ప్రయోజనమేమిటి? (ఎవరో వస్తున్న శబ్దం) అడుగో నిక్కి నీలిగి 9 గంటలకు దయచేస్తున్నట్టున్నాడు (ఆ వైపు చూస్తాడు)

[మల్లారాం జార్జెటుసిల్కు చీరలతో ప్రవేశం]

మ : ఏంటీ? కంగారుగా చూస్తుందార్?

రంగ : అబ్బె, గుమాస్తా అనుకున్నాలెండి. రండి, దయచేయండి. (లేచి అణకువతో పీట చూపిస్తాడు)

మ : కూర్చోడానికి రాలేదువయ్యా. నిన్న డైలీ సొమ్ము యింకా పంపలేదని వచ్చా.

రంగ : (చేతులు నలుపుతూ దగ్గరకెళ్లి) చీరలు బాగున్నాయే! ఎలా కొన్నారు?

మ : చీరల్కేమిలే; పైసాగురించి తేల్చవయ్యా.

రంగ : యిప్పుడే కంపెనీ తెరిచా; యింకా బేరంలేదండీ.

మ : నీ బేరంగొడ్వ నాకెందుకు....నాకు పైసాకావాలి, పైసా!

రంగ : మీడబ్బు—మా క్కానీ అక్కరలేదు. ఒక్కరోజు ఆలస్యానికే అలా అంటె.........?

మ : ఒక్కరోజుకాదు....ఒక్క క్షణంకూడా ఆగేదీ లేద్.

రంగ : సొమ్ముంటే మీతో మాటలనిపించుకుంటానా? మొన్న పాతికవాయిదాల డబ్బు ముందే కట్టేసి వడ్డీ ముదరాకూడా అడగలేదే?

మ : ముందు కట్నావేమో—మళ్ళీ సొమ్ము తీసుకున్నావేమో!

రంగ : బేరాల్లేక శ్లేష్మంలోపడ్డ యీగల్లా కొట్టుకుంటున్నామండీ.

మ : హేమిహయ్యో! మీకీ యుద్ధంరోజుల్లో మస్తుగా లాభం వస్తే మాకీ ముఖం చూచార్? అవసరంవచ్చి సొమ్ము తీసుకెళ్ళి పైగా బరేమాటల్ హోడుతున్నావ్? ఇది పైసా! హోత్‌మే పైసాతోనే వుంది సారే దునియా!

రంగ : ఏం లాభాలో—ఈ ఆరేండ్ల స్వతంత్రంలో హారతి కర్పూరంలా హరించిపోయింది.

మ : మీకీ లాభం వస్తే స్వతంత్రం లేకపోతే కుతంత్రం! బేయిమాణా!....మాకీ యిన్నిమాటల్ దేన్కి? ఇంకో గంటలో సొమ్ము పంపకపోతే ...హు ..(అని బయట దేరగా చీర జారిపడుతుంది. రంగయ్య అందిస్తాడు. "ఇహిహిహి" అని పళ్ళికిలిస్తూ ఆప్యాయంతో బుర్ర వంచుకొని—చీర చంకలో పెట్టుకొని వెళ్ళిపోతూండగా గుమాస్తా ఆపర్జాలతో ప్రవేశిస్తూ "రాం, రాం సేట్జీ" అంటాడు. మల్లూరాం యీసడింపుతో "రాం, రాం" అంటూ వెళ్ళిపోతాడు.)

సత్యం: (మార్వాడీ పోకనుచూచి అక్కడే ఆగి) రంగయ్య గారూ!—అసలీ ఆవర్జా నెప్పుడైనా చూస్తున్నారా?

రంగ : ఏం?

సత్యం: అసలు ముందొచ్చిన ముప్పైవేలు యీ ఆరేండ్ల స్వతంత్రంలో ఎలా హరించిపోయిందో తెలుస్తుందని.

రంగ: ఎలా తెలుస్తుంది?

సత్యం: అందుకే గుమాస్తాను మూడోనేత్ర మన్నారు. ఏమండీ, (ప్రక్క కొచ్చి) ఇదిగో చూడండి, (అవర్జా చూపి) ఇది లాభ నష్టాల కాతా. 46 నాటికి మన లాభం 30 వేలు. యీ ఆరేండ్లలోను ఆ లాభం ఎలా మాయమైపో యిందో తెలుసా? యిదిగో వడ్డీకాతా. 24 వేలు మార్వా డీలకు పోశాం. 8 వేలు ఇన్‌కంటాక్సు, సేలుటాక్సులకు కట్టాం. ఇప్పుడు మనం నష్టంలోనే ఉన్నాం....ఇప్పు డర్థమైందాండి, యీ ఆరేండ్ల స్వతంత్రంలో అనుభవించిం దెవరో?

రంగ: ఇంతకీ యీ స్వతంత్రం వచ్చాక, బాగా డబ్బున్నోడూ లేనోడూ బాగుపడ్డా రంతే.

సత్యం: అదేమి టలా అంటున్నారు?

రంగ: లేకపోతే 9 గంటలకొచ్చే గుమాస్తా ఎవడండీ?

సత్యం: అదేమిటండీ? రాత్రి 11 గంటలవరకూ యిక్కడే పని చేశానా. మాకూ నిద్ర—సుఖం, పెళ్ళాం, బిడ్డలు లేరం టారా?....అవునులెండి; చల్లగా చేతుల్తో దువ్వి మెల్లగా రక్తాన్ని పీల్చే మార్వాడీలకే ప్రాధేయపడతారుగాని—క్రుంగిపోతున్న గుమాస్తాను మాత్రం ఆలించరు.

రంగ: "క్రుంగిపోతున్నాం, క్రుంగిపోతున్నాం" అని ఎలాగైతేనేం రెండు ఎంగిలిముక్కలు నేర్చారు....

[మల్లారాం ఒగర్చుకుంటూ "రంగయ్యగోరూ, రంగయ్య గోరూ" అంటూ పత్రికతో ప్రవేశం.]

రంగ : అరెరె! అంత కంగారుగా వచ్చారేంటి?

మ : కంగారూ, గింగారూ కాదూ....మాకీ సొమ్ము హంతా హిష్టూ హిచ్చెయ్యవలసిందే.

సత్యం: వాయిదా పూర్తికాకుండానే?

మ : ఆఁ! హంత్కీ కాకపోతే వడ్డీ మువరా యిచ్చేస్తాం!

రంగ : ఇంత అకస్మాత్తుగా అడుగుతున్నారేం?

మ : ఇంకేమి వుందివయ్యా!....ఇదిగో పత్రిక చూడవయ్యా, కొరియాలో యుద్ధమాగిపోయింది! (కూలబడతాడు.)

రంగ : (విసుగుతో) ఆగిపోతేనేమండీ బాబూ!

మ : (లేచికూర్చుని) ధరల్ పడిపోయి వర్తకాల్ దివాళాలే!

సత్యం: అయితే మీకు బాగా వడ్డీలు రావాలంటే, యుద్ధం కావాలన్నమాట....?

మ : మాకు వడ్డీలు కాదోయ్! మీ షాహుకార్కి లాభాలు కావాలన్నా యుద్ధం కావల్సిందే, తెల్సా!

సత్యం: (పళ్ళుకొరుకుతూ) యుద్ధం! అది చల్లటి జీవితాలకు చిచ్చుపెడుతుంది. ప్రశాంత నగరాలను భస్మం చేస్తుంది. సమస్తాన్నీ నాశనంచేసే బ్రహ్మరాక్షసి—యుద్ధం!.... పుష్పానికి సూర్యరశ్మి ఎంత అవసరమో, ప్రజలకు శాంతి అంత అవసరమని గుర్తించండి!

మ : మాకీ యీ సోదంతా హెందుక్కా? సొమ్ముకావాలి! సొమ్ము లేనోడు శవంతో సమానమే!

రంగ : నిజం చెప్పారు సేటుగారూ! మాపని నిజంగా అలాగే వుంది.

మ : నీపని ఎలాగుంటే నాకేమయ్యా! నాకీ సొమ్ము ఇంకో గంటకు సర్దేయపలసిందే!

రంగ : ఆఁ! అయిదువేలు - గంటలో ఎలా వస్తాయండీ?

సత్యం: ఏదైనా చెట్టు దులిపితే సరి! (పనిలో నిమగ్నుదౌతాడు)

మ : దుల్పకాపోతే దారికాయండి. సరే చూస్తా! గంటలో నా సొమ్ము రాకపోతే....(వెళ్ళిపోతాడు)

రంగ : (గుమాస్తాతో) ఎంతమాటనేశారు! (పచారుచేస్తూ) ఆయ న్నెలాగో మెప్పించి పంపుదామనుకుంటే—కోతి పుండు బ్రహ్మరాక్షసి చేశావు....! వెళ్ళి చెప్పు, ఆ మార్వాడీకి ఏం చెబుతావో! (లోపలికి వెళ్ళబోగా ఎదురైన ముత్యాలుతో) ఏమోయ్! కొత్త కుర్రోడికి కాలితే. టక్షన పనికట్టేసి అంతా కట్టకట్టుకుపోతారా?

ముత్యా: రంగయ్యగారూ! ప్రమాదాన్ని అంత తేలిగ్గా చూడకండి! వారం రోజులైనా ఆస్పత్రిలో వుంచాలని పెద్ద డాక్టరు గారే అన్నారు.... సరేలెండి! ఇదిగో (ముఖం ప్రక్కకు తిప్పుకొని) మా సంఘతీర్మానం! (ఇస్తాడు)

రంగ : (చక్మని పుచ్చుకొని, చూచి) ఏంటీ! కూ లెక్కువ చేయాలా? షాప్ యంప్లాయీస్ చట్టంప్రకారం-వారాని

కోరోజు కూలిపై సెలవివ్వాలా? షేష్! బాగుంది (సీరియస్‌గా) లోపల కాలుతున్న కొలిమిలో పారేయ్!

ముత్యా: దురుసుకుపోతున్నారుసుమాండి!

రంగ : దురుసూ! తలబిరుసు మీకు చెల్లింది!

ముత్యా: రంగయ్యగారూ! ఒక్కసారి మీ రెనక్కి తిరిగి చూడండి! వెనుక మీ బాబు, మీ పెదనాన్నవద్ద పనిచేస్తూ, చేసిన పనికి కూలికోసం మిమ్మల్నే పంపితే మీ పెదనా న్నేమ న్నాడో గుర్తుకు తెచ్చుకోండి.

రంగ : ఏమన్నాడు, కూలిచ్చి పంపించాడు.

ముత్యా: నేనూ అప్పుడు పోతమేస్త్రినే! గుర్తుకు తెచ్చుకోండి 'నన్నేడిపించుకు తినేకన్నా, విషం తిని చావండిరా!' అని గెంటేయలేదూ?

రంగ : నోరుముయ్!

ముత్యా: అవునే, మూస్తానులెండి! మన కిప్పుడు ఆ రోజులు గుర్తుకురావు!

రంగ : ఏయ్, ముత్యాలూ! కుడీ ఎడమా తెలుసుకోకుండా మాట్లాడుతున్నావు. కూలిపై సెలవూలేదు, కూ లెక్కవాలేదు యిష్టమైతే పనిచేయండి! లేకపోతే పోండి!

ముత్యా: పోతా! కాని బంగారపు పళ్ళానికైనా గోడచేరువుండాలని మరచిపోకండి. (వెళ్ళిపోతాడు)

సత్యం: (తలెత్తి) తింటున్న విస్తరినే కాలదన్నుకున్నారు.........

రంగ : తన్నుకోలేదు. తలబరువు దించుకున్నానయ్యా!

సత్యం: అసలు మనకు లాభం కలిగించేదే వాళ్ళ శ్రమ. నిజంగా శ్రమజీవులు—బంగారుగ్రుడ్లుపెట్టే బాతులు....వాళ్ళనేనా కాదని పొమ్మనటం....?

రంగ: తగుదునమ్మా అని మీ రెందులోను మధ్యకు రాకండి.

సత్యం: నాకెందుకులెండి! బొఱుపు కడితేనేగాని ఎవరూ తడుం కోరు: సరే, (లేచి) నేను ఇన్‌కంటాక్సు ఆఫీసుకెడుతున్నా. (వెళ్ళబోయి నిలబడతాడు)

రంగ: ఏం? వెళ్ళండి.

సత్యం: ఏమైనా సాదర....?

రంగ: సాదర వాడడాని కిక్కడేం పాతర లేదు.... మొన్న జీతం తీసుకెళ్ళి మళ్ళా వాడకమా?

సత్యం: పదేండ్లనుండి మీవద్దనే పనిచేస్తున్నా. ఏం సంపాదించానో మీకే తెలుసు....అదీగాక యీ ఏడాది జీతం పెంచుతాననికూడా........

రంగ: పైగా యిదొకటా? ఏదో ఎప్పుడో అంటే అదే పట్టుకు వ్రేలాడ్డమా?... ఏమండోయ్, పదికాలాలపాటు పనిచేస్తున్నారనే యీ జీతమైనా .......లేకపోతే కాళ్ళరిగేటట్లు ఎంతమంది గుమాస్తాలు నాచుట్టూ తిరగడంలేదూ!

సత్యం: (కోపమొస్తుంది) రంగయ్యగారూ! కాళ్లున్న ప్రతివాడూ తిరుగుతాడు. కాని ఆ చేతులున్న ప్రతివాడూ, యీ అకౌంట్సు వ్రాయలేడని తెలుసుకోండి!

రంగ: మీరంతా ఏకమైనా—ఒక్క దమ్మిడీ సాదరఖర్చుకిచ్చేదిలేదు.

సత్యం: పోనీ జీతం పెంచండి.

రంగ : భేషుగ్గా వుందోయ్ వరసా! వాళ్లు కూలి పెంచమనీ, మీరు జీతం పెంచమనీ—బాగుంది!.....జాగ్రత్త, నా తల కొట్టి మొలేద్దామనుకుంటున్నారేమో!

సత్యం: గోతిలో కాలేస్తున్నారు షావుకారుగారూ!

రంగ : మీరు వేయించా లనుకుంటున్నారు.

సత్యం: మీ క్షేమాన్ని కాంక్షించేవారిని గోతిలో దింపుతున్నా రంటున్నారా?

రంగ : దింపడంలేదు, ఏకుమేకై నెత్తికి శీల దిగ్గొడుతున్నారు.

సత్యం: తేనెనే విషంగా భావిస్తున్నారుసుమాండి!

రంగ : చాల్లే, ఇక మర్యాద దక్కించుకొని పోవయ్యా.

సత్యం : (ఆవేశంతో) ఇదిగో! తిండిలేక చిక్కి శల్యమైపోతున్నా; మీపనివల్ల నరాలబలహీనత తెచ్చుకొని క్రుంగిపోతున్నా; మీ శ్రేయస్సే లక్ష్యంగా పెట్టుకొని విశ్వాసంతో పనిచేస్తున్న గుమాస్తాను కనికరంలేకుండా పొమ్మంటున్నారా?

రంగ: ఇంకా అధికప్రసంగం చేస్తే పొమ్మంటానా? తరుంతానా?

సత్యం: ఏమిటీ! బృహస్పతితో సమానమైన గుమాస్తాను తరుంతారా?

రంగ : తరుంతానా? తరిమి చూపిస్తానా? పాతిక పారేస్తే కొమ్ము లొచ్చిన గుమాస్తా ........

సత్యం: మీరు తరమడ మెందుకులెండి. కాని ఒక్క విషయం: అక్కౌంట్సంటే కరకుకత్తులతో సమానం. పసికందు చేతిలో కత్తి పెడితే ఏంచేస్తాడో, పాతిక, పరక గుమాస్తా చేతిలో అక్కౌంట్సు పెట్టినా అంతేనని మరచిపోకండి. మరి సెలవ్. (వెళ్ళిపోబోతాడు)

రంగ : ఆగండి! ఇన్‌కంటాక్సు అక్కౌంట్సు అప్పగించి వెళ్ళండి.

సత్యం: అటువంటి ద్రోహానికి అన్నంతినే గుమాస్తా తలపెట్టడు. ఇవిగో కాగితాలు. అన్నీ తేల్చేసా! ఇక వాయిదాకు హాజరవడమే. సెలవ్! నే వెళ్ళాకయినా ఒక్కసారి గుండెపై చేతులేసుకొని ఆలోచించమని మనవి!
(వెళ్లిపోతాడు)

రంగ : ఊ వెళ్ళుదూ! (అనేసి యిటు తిరుగుతూ) అబ్బబ్బబ్బ! నమ్మినోడల్లా నిలువునా తినేస్తున్నాడు....ఇక మార్కెట్టు చూద్దామా–అమ్మి సొమ్ము ఇమ్మంటేనే, పుచ్చుకొనే దాతలేడు....నానాటికి ధరలు పడిపోయి, అడిగే నాథుడే కనబడ్డంలేదు....పై ధరలు చూస్తే దమ్మిడీ తగ్గలేదు.... పైగా అమెరికావాళ్లు, గుజరాతీ మార్వాడీలచేతుల్లో అల్యూమినియం మార్కెట్టు పడిచింది!....ఇక షావుకారు బాగుపడ్డం కల్ల. తల మునిగి. కొంప నష్టేటిలో కలిసి పోవలసిందే.....(ఒక్కొక్కడునే ముందు కేస్తుంటాడు)
[మార్వాడీ తాళంకప్ప, తాళంతో నెమ్మదిగా ప్రవేశం.

రంగయ్య వణికిపోతూ "రాం, రాం" అంటాడు. మార్వాడీ గర్వం, యీర్ష్యతో "రాం, రాం" అంటాడు.]

మ : ధరల్ గిరల్ అన్నీ వుల్టాసీదా హాయిపోయాయ్! మళ్ళీ యుద్ధం రాజుకుంటేనే చేతుల్లో పైసా! పైసా!....

రంగ : నిజం చెప్పారు సేటుగారూ!

మ : అయితే నా సొమ్ము పారెయ్!

రంగ : రెండురోజు లోపికపట్టండి. పని కట్టేసి పనోళ్లు పోయారు. ఇన్‌కంటాక్సు వాయిదా పీకలమీద కత్తిలా పెట్టి గుమాస్తా పోయాడు. అంతా అడివిలావుంది....ఇంకో రెండు రోజులు....

మ : ఇక రెండు నిమిషాల్‌కూడా హోగమ్. మీకీ హడివి అయితే నాకేం? గోదారికీ దిగితే నాకేం? (తాళం చూపి ఇది చూశావా? అహహహా! ......

రంగ : ఏంటీ! కంపెనీకి తాళాలేస్తున్నారా? సేటుగారూ! ఇవి చేతులుకావు - కాళ్లు....నా పరువు మంటకలిసిపోతుంది. ఒక్కరోజు కాయండి! ఇల్లూ వొళ్లూ తాకట్టుపెట్టయినా మీ ఋణం తీరుస్తా!

మ : అరె! మనిషివికాదూ! మర్యాదగా బయటికి పోతావా? పోవా?

రంగ : మీ రలా చేస్తే నేను బ్రతికెందుకు? యీ తాళంకప్పతో నా తల పగలకొట్టేయండి! లేకపోతే, తలెత్తుకుని తిరగ లేను ..

మ : ఇక సొమ్ముతో బ్రతిమాలుకో పో. మర్యాదగా బయటికి పో: లేకపోతే మెడపట్టుకు గెంటుతా.

రంగ : ఇంతేం చేసినా సంతోషమే.

మ : ఊ, తప్పుకో. (త్రోసేసి తలుపేసొచ్చి) పూఁ, బయటికి నడు.

[రంగయ్య మల్లారాంకాళ్లు పట్టుకొని "సేటుగారూ" అంటాడు. మల్లారాం తోసేస్తాడు. రంగయ్య మళ్ళీ కాళ్ళు పట్టుకొని "సేటుగారూ" అని బ్రతిమాలుతాడు. మల్లారాం కాళ్ళు ముందుకు లాక్కుంటాడు. రంగయ్య. మల్లారాం కాళ్ళు పట్టుకొని ప్రాకుతాడు. మల్లారాం రంగయ్యను బయటికి త్రోసేసి "ధన్" మని తలుపేశేస్తాడు. తరువాత తాళంగూడా వేసిన శబ్దం.]

[ తెర ]

# ఇదా స్వతంత్రం?

## నాలుగో రంగం



[సత్యంయిల్లు. బట్టలున్న దండెం. ఊయలలో పసికూన నిద్రిస్తూంటుంది. బయట "శారదా! శారదా! శారదా!!!" అని తలుపు చప్పుడు. ఇంకోవైపునుండి "తీసేవుంది గెంటండి" అన్న జవాబు. సత్యం తలుపు గెంటి తూలుతూ ప్రవేశం.చొక్కా, పంచె చినిగాయి. గెడ్డం మాసివుంటుంది.]

సత్యం: (ప్రవేశించి) శారదా! (దిక్కులుచూచి) శారదా...శారదా! (లోపల్నుంచి "యిలా రాకండి" అన్న శారద మాటలు. ఆ దృశ్యం వూహించి సత్యం చలించి, విషాదాశ్చర్య చకితుడై "శారదా" అంటూ గోడకు జేరబడిపోయి) ఎంత దారుణం? (మధ్యకు వచ్చి) నాగరిక స్త్రీ వైన నీ శరీరాన్ని కప్పడానికి కాస్త ముతకచీరైనా కొనలేని దౌర్భాగ్యుణ్ణి: నీకెంత ద్రోహం చేశాను? నీకేకాదు. స్త్రీ జాతికే ద్రోహం చేస్తున్నా! మానరక్షణే ప్రాణరక్షణగా ఎంచే భారతస్త్రీకి ఘోరఅన్యాయం చేస్తున్నా. (నెత్తి కొట్టుకొని) చెండాలుడ్ని. (దిగజారుతూ) చీర కొనలేకపోయా. ఎలా కొనగలను? మాసాల తరబడి ఉద్యోగమే లేదు. ఇక తిండి, బట్ట ఎక్కడనుండొస్తుంది? ఇది మానపరీక్ష! (గంభీరంగా) భీమునిచే దుశ్శాసనుని వేడిరక్తం త్రాగిం

చిందీ పరీక్షే. ఎలమర్రు తెలుగుపడుచులచే మంత్రోంగాన్నే భూపతనం చేయించిందీ పరీక్షే. (సాలోచనగా) కానియ్! శారదా! వుండు, నా పంచ కట్టుకొందువుగాని. (దండెంపై పైజామా తీసి ప్రక్కకువెళ్ళి కట్టుకొని పంచతెచ్చి లోపల శారదపైకి విసురుతూ "ఇదిగో ఇది కట్టుకో" అంటాడు. ఇంకో క్షణమయ్యాక శారద బట్టచుట్టుకొని ప్రవేశిస్తుంది. ప్రవేశంలోనే "శారదా, శారదా.... శారదా!" అంటూ కౌగలించుకుంటాడు. శారద భర్త బాహువుల్లోయిము డుతుంది.)

సత్యం: (శారదముఖం చూచి) వచ్చే జన్మలోనైనా నాలాంటి భర్తను పొందకూడదు నీవు....

శారద: అలా అనకండి! (కాళ్ళపైబడి) వచ్చే జన్మకే కాదు, జన్మజన్మాలకు మీలాంటి విశాలహృదయులే నా భర్త కావాలి!

సత్యం: ఎందుకు? ని న్నేడిపించడానికా? వస్త్రవిహీనను చేయ డానికా?

శారద: పోనీలెండి! పనిదొరికేవరకూ ఎలాగో గడుపుకుంచాం. మీరుమాత్రం సాధ్యమైనంత త్వరలో ఉద్యోగం........

సత్యం: ఉద్యోగమూ లేదూ,.... మన్నూ లేదూ........! చీమలు తిన్నరొట్టెల్లా బజారులో ఎక్కడ చూచినా నిరుద్యోగులే. కాస్త తిండిపెడితే పనిచేసే గుమాస్తాల సంఖ్య పెరిగి

పోయింది. (సాలోచనగా చిటికేసి) శారదా! చక్కని ఆలోచన తట్టింది.

శార : ఏమిటది?

సత్యం: సైకిలురిక్షా లొచ్చాయి!

శార : సైకిలురిక్షా తొక్కుతారా? ఇంతబ్రతుకూ బ్రతికి ఇంటి వెనకాల చావడమా?

సత్యం: పిచ్చిదానా! మువ్వలా మూసనెత్తి గవ్వలా దేకించే పని వాడు - మా మేస్త్రీ ముత్యాలు అదే త్రొక్కుతున్నాడు.

శార : వొద్దు - దొరికినప్పుడే దొరుకుతుంది గుమాస్తా పని. (దండెంపై గావంచా తీసి) బట్టలు మార్చి యిది కట్టుకోండి.

సత్యం: ఎందుకులే శారదా! పుట్టుకలోనూ, చావులోనూ లేని బట్ట మధ్యెందుకని మన వేమన చెప్పాడుగా వేసం.

శార : మన బ్రతుకుల్ని వేదాంతంలోకి దించకండి.

సత్యం: (విచారంతో శారద తల దువ్వుతూ) శారదా! పచ్చి బాలింతరాలివి నీవు. ని న్నెట్టి కష్టాలు పెడుతున్నాను! ఇదీ మన ఆరవయేటి జీవితం! (వూయలలో పాపను చూచి) పా పింత చల్లగా నిద్రిస్తోందేం?

శారద: విస్తళ్ళ కుట్టుకూలి పావలా వస్తే బేడ పాలు కొని పట్టా.

సత్యం: నీచే పనిచేయించేటంత సోమరినైపోయా!

శారద: అస్తమానూ అలా అనకండి. (చేయి నోటి కడ్డు పెడుతుంది.)

సత్యం: (లేచి) అదిగో! దొడ్డిలో తాటిచెట్టు మనపై జాలిగా రెండు పళ్ళతో చూస్తోంది! యీపూట కవి రొట్టెలు చెయ్.

శారద: తాటిపండ్లుతింటే కలరా రాదూ?

సత్యం: మనపై కలరాదేవత కంత ప్రేమున్నా బాగుణ్ణు!

శారద: నిరాశ చెందకండి! ఇంకా బేడ మిగిలితే వీధిలో కొచ్చిన కర్రపెండలంకొని వుడకేశా! యీ గావంచా కట్టుకోండి.

[అని శారద లోనికి వెళ్తుంది. సత్యం వ్యధతో గావంచా పైన వేసుకొని "దుంపలుతినే దుర్గతి" అని మంచంపై కూలబడతాడు.]

నేపథ్యంలో పాట

ఓయి గుమాస్తా!
రాజభోగులూ
నల దమయంతులు
ఒక్కచీరనే యిరువురు కలసీ
ధరించలేదా ?

పదునాల్గేండులు
సీతారాములు
అడవుల దుంపలు తినలేదా?

ఓయి గుమాస్తా!
కనువిప్పి చూడు లోకం!
కనిపెట్టు క్రొత్తమార్గం!!

[శారద లోపలనుంచి ఆయాసంతో వచ్చి కళ్ళు తిరిగి పడిపోతుంది.]

సత్యం: శారదా! (వడిలోకి లాక్కొని) అబ్బ! ప్రొద్దస్తమానూ ఆ పొయ్యివద్ద కూర్చుంటే కళ్లు తిరగవూ? అందు లోనూ బాలింతరాలివిగదా? (పైనున్న గావంచాతో తడిసివున్నది గాబట్టి ముఖం తుడిచి) బంగరు తీగలాంటి నీ శరీరం ఎలా శుష్కించిపోయింది! (లేవనెత్తుతూ) మిల మిల మెరిసే నీ తల ఎలా ముగ్గుబుట్టలా మారిపోయింది?

శారద: (తేరుకొని ప్రక్కకు తిరిగి) మీరు మరీ కృంగిపోతు న్నారు!

సత్యం: లేదు శారదా! మానవుల్ని దయ్యాలుగా చేస్తున్న యీ లోకంమీదే నా ద్వేషం ––

ముత్యా: (రిక్షాకార్మికుని దుస్తుల్లో ప్రవేశించి, చెమట తుడుచు కుంటూ) దెయ్యాలుకూడా దేవతలౌతాయి గుమాస్తాగోరూ!

సత్యం: రా ముత్యాలూ! కూర్చో. (ముత్యాలు కూర్చుంటాడు.) యిప్పటికీ దెయ్యాలైన మానవులు చస్తే–నీవన్న దేవ తలమౌతామోయ్!

ముత్యా: చేతిలో కలమున్న మీకే యింత నిరాశా?

సత్యం: ఎందుకు–వెధవకలం! ధనికుడి నింకా ధనికుణ్ణే చేయడానికి పద్దులురాసే బండకలం?

ముత్యా: పదును పెట్టండా కలానికి. అప్పుడు మీ కలం–మా కార్మికుల కండబలంకంటె, వీరుని కత్తిబలంకంటేకూడా శక్తిగలదౌతుంది.

శారద: అంటే?

ముత్యా: అదేంటమ్మా! అష్టకష్టాలు పడుతున్న సత్యంగారు ఆ కష్టా లను ఒక నాటకంగా వ్రాస్తే ఎంత బాగుణ్ణు!

సత్యం: ఏమిటో! నే నెరుగున్న ఓ కవి—జీవితాన్ని తిరచి తరచి, కళాసముద్రంలో చాపలా యీదీది—అద్భుతమైన నాటకం రాసి ప్రదర్శిస్తే—నూటయాభై నష్టమోయ్! పాపం! ఆయనే మొన్న రక్తం కండ్ల కార్చి చెప్పాడు. యీ స్థితిలో నాటకాలు ఏం లాభం ముత్యాలూ?

ముత్యా: అదిగో! తాత్కాలిక నష్టం చూచి, శాశ్వతలాభం విడిచి పెడతామూఅంటే? వెనుక మాభూమి నాటక మాడితే కనకవర్షం కురవలేదటయ్యా?

సత్యం: లాభంవద్దూ....బూడిదావద్దూ! నష్టం లేకుండావుండే చాల్లేవోయ్ ముత్యాలూ!

శార: అవును, నాటకం రాయండి; ఒక గుమాస్తా పడే బాధలు చూచి యీలోకం సిగ్గుపడి సానుభూతైనా చూపుతుంది. ఎన్నో గ్రంథాలు అహోరాత్రులు చదివేరు. ఆ జ్ఞానాన్ని వృథాచేయడ మెందుకు?

సత్యం: అయితే అదీ చూద్దాం. (ముత్యాలుతో) చూద్దామోయ్!

రంగ: (ఒగర్చుకుంటూ "గుమాస్తాగారూ, గుమాస్తాగారూ" అంటూ ప్రవేశించి) నూలిగేనక్కమీద తాటికాయ పడింది.

ముత్యా: బండరాయి కాదుకదా?

సత్యం: (లేచి) ఏమిటా కంగారు రంగయ్యగారూ?

రంగ: ఇంకేముంది? పన్నెండువేలిన్‌కంటాక్సు పడింది. ఆరు మాసాలక్రితం కంపెనీకిపడ్డ మార్వాడీ తాళా లలాగే వున్నాయ్.

ముత్యా: హు! మా బ్రతుకులకే తాళాలేశారుగా మీరు?

రంగ: నన్ను బాధించకు ముత్యాలూ!

సత్యం: యీ అధికారులు కోట్లకొలది రూపాయల పన్ను ఎగ్గొట్టే గుజరాతీ కోటీశ్వరులజోలికి పోరు. మీలాంటి చిన్న షావుకార్ల నెత్తికొట్టడానికే తయారౌతారు.

ముత్యా: మీరింకా ఎనకటి రోజుల్లోనే వున్నట్టున్నారే, ఆ గుజరాతీ కోటీశ్వరులూ అధికారులూ ఒకటికాదటయ్యా! ఏమిటో, యీ చిన్న షావుకార్లు వాళ్ళనే నమ్ముతారు. (వ్యంగ్యంగా) ఇంతకీ తల కొట్టేది వాళ్ళుకాదు.... కార్మికులే నంటారు, రంగయ్యగారు!

రంగ: మాటలతో చంపుతున్నావ్ ముత్యాలూ?

శార: అలసిపోయారు. (నీళ్ళు తెచ్చిస్తూ) ముందివి తీసుకోండి!

ముత్యా: ఆ(. ఆ(! అవి పుచ్చుకోకండి! మీ చావుకోరే పేదోళ్ల మంచినీళ్ళంటే నమ్మతున్నారా? - అది విషం!

రంగ: అబ్బ! చచ్చిన శవా న్నింకా ఎందుకు కొడతావ్?

సత్యం: ముత్యాలూ! ఆయన్ని బాధించకు; అవస్తతో వచ్చిన వ్యక్తిని ఆదరించడం మన ధర్మం.

ముత్యా: ఆదరణ! ఇదిగో, నరాలు చుట్టుకుపోతున్నా, ఆర్నెల్ల నుండి సైకిలురిక్షా త్రొక్కుతున్నా. యీ లోకం నన్ను

ఆదరించిందా? నా రెక్కలకష్టం ధారపోసిన యీ రంగయ్యగారే........

రంగ: (బాధతో దీనంగా) ఇక అపుచెయ్ ముత్యాలూ!....నీ చేతులు పట్టుకుంటున్నా, విను.

శార: యిప్పటికైనా కనికరించండి. ... (లోపలకెళ్లి దుంప ఉడికిన దాక తీసుకొచ్చి) ఇదిగో, దుంప ఉడకబెట్టుకు తింటున్నాం.....

సత్యం: మేం కోరేదికూడా కాస్త గంజిలోకి వుప్పు• వంటిపైకి బట్టేగా!

రంగ: (చేతులు పట్టుకొని) క్షమించండి. కళ్లు మూసుకుపోయి మిమ్మల్ని ఏమేమో అన్నా. ముప్పైవేలు మీవల్ల సంపాదించి, ఆ కసాయిమార్వాడీల ఖజానాలో వడ్డీలక్రింద పోశాను. మీ న్యాయమైన కోర్కెలను అంగీకరించలేకపోయా. ఆనాడు మీరు, ముత్యాలు చెప్పిన మాటలన్నీ వేదాక్షరాలే. క్షమించండి; క్షమించండి సత్యంగారూ! ఇక మీరు కోరినట్టే నడుచుకుంటా.

సత్యం: పోనీలెండి, మీ షావుకార్ల కెన్నిబాధలున్నా, అంతకంటె బాధపడేవారు గుమాస్తాలు, కార్మికులూనని పనివారల కోర్కెలను అంగీకరించినందుకు సంతోషం. ఇలా వర్తకలోకంఅంతా గుర్తిస్తే దేశం ఎంతబాగుపడేది. మన భారతదేశానిని సంకెళ్ళు బ్రద్దలుకొట్టి సంపూర్ణ స్వాతంత్ర్యం

సాధించి వుండగలిగేవాళ్ళం. చెట్టిపట్టాల్ పట్టి పవిత్ర భారతదేశాన్ని సుభిక్షం చేసుకునేవాళ్ళం.

రంగ: యిప్పుడు గండం గడిచే మార్గం?

సత్యం: వుంది. నే ఇన్‌కంటాక్సు గొడవ చూస్తా. మీ రిద్దరు అమ్మేసి మార్వాడీపీడ వదిలించి, కంపెనీ ఆడించండి.

రంగ: ఎలా ఆడించడం? అల్యూమినియం మార్కెట్టంత చాల మందంగా వుందాయె!........

సత్యం: ఎంతకాల ముంటుం దీ మందం? అదీగాక మందంలో ఆడించినోడే మగోడు!

ముత్యా: (కోపంతో) ఆడించాలి, ఏం టాడించాలి: చిన్న చిన్న కంపెనీల దివాళాలకు, కాకుల్నికొట్టి గద్దలకేసే ఇన్‌కం టాక్సు విధింపులకు, పీల్చి పిప్పిచేసే మార్వాడీ వడ్డీలకు, అన్నింటికీ కారణం గుజరాతీ గుత్త కోటీశ్వరులు. వీళ్ళే దేశాన్ని ఆంగ్లో—అమెరికన్ల కమ్మేస్తున్నారు. యీ వర్గం మనదేశానికో వ్రణం! దీనికి పట్టీవేసి పోగొడదా మంటె పోదు........

రంగ: మరెలా పోతుంది?

ముత్యా: వ్రణం—కోస్తే పోతుంది.

రంగ: దేనితో? ఎలా కోస్తాం?

ముత్యా: ఇదిగో! (పిడికిలి బిగించి) ఐక్యతా శస్త్రంతో.

సత్యం: అవును! (పిడికిలి బిగించి) గుమాస్తా, కార్మికుడు, షావుకారూ బిగించిన పిడికిలే—యీ కోటీశ్వరులను

లొంగదీస్తుంది!

ముత్యా: పతనం గావిస్తుందికూడా (ముందుండి) గుత్త పెట్టుబడి దారీవర్గం—

ముగ్గురు: (పిడికెళ్ళు బిగించి) నశించాలి!

సత్యం: పీడితజన ఐక్యత—

ముగ్గురు: వర్ధిల్లాలి!

రంగ: అయితే కంపెనీకి వెళదాం పదండి.

ముత్యా: ఊఁ, పదండి! (ముగ్గురూ ఒక్కసారిగా ముందడుగేసి ఒక్కసారిగా "పదండి" అంటూ వెళ్ళిపోతారు)

శారద: (వెళ్తున్న ముగ్గురనూ.చూచి ఆనందంగా)

హాయీ హాయీ హాయీ
ఇక జీవితమే హాయీ
కాపురమున్న కలతలు
కష్టాలన్నీ తొలగెను
ఇక పుచ్చపువ్వులా వెన్నెల కాసి
నవజీవన శోభనె చేకూర్చునుగా ॥హా॥

[ తెర ]

# ఇదా స్వతంత్రం?

## ఐదో రంగం

[భూషణం యిల్లు. నలదమయంతుల బొమ్మ, మంచం, దండెం, వూయెల వుంటాయి.

భూ : (మార్చుకున్న బట్టలు సర్దుకుంటూ ప్రవేశించి లోపలికి చూస్తూ) వుమా! నాటకంలోని వేషాల దుస్తులకన్న అసహ్యంగా వున్నాయ్ యీ మన దుస్తులు.

వుమ : (తనూ మార్చుకున్న బట్టలు సర్దుకుంటూ ప్రవేశించి) ఏమిటో "కళ కళ" అని కొట్టుకాడడమేగాని చిప్ప చేతికొస్తున్నది కానడంలేదు!....

భూష : సువర్ణంకూడా చేతికిస్తుం దీ కళ!

వుమ : ఇదిగో! ఇప్పటి కీ నాటక మెలాగో తెల్లారింది. ఎలాగో యీ మూడ్నెల్లు కార్మికులు సర్దారు. ఇక ముందుగతి?

భూష : అదా నీ సందేహం! ప్రజలకోసమే మనం నాటకాలు వ్రాస్తున్నప్పుడు - వాళ్ళే మనలను ఆదుకుంటారు.

నప్పు: (కార్మికనాయకుడు ప్రవేశం) అవును ఆదుకుంటారు. ప్రజాకవిని ప్రజలే పోషిస్తారు.....ఇదిగో! యీ నాటకానికొచ్చిన నికరాదాయం రెండు వందలు—కార్మికులు మీకు విరాళమిచ్చారు. అంతేకాదు. చీకటిలో తడుంకుం

టున్న పీడిత ప్రజలు నీవు చూపిన వెలుతురుకు ముగ్ధులై కార్మికు లీ షీల్డుకూడా బహూకరించారు.

భూష : చూశావా ఉమా! ఇప్పుడు నీ వన్నది తప్పని వొప్పుకొని గుంజీలు తియ్. (సంతోషంతో)

వుమ : (ఆనందంతో) చంపలుకూడా వేసుకుంటా. (వేసుకొని గుంజీలు తీయబోతుంది)

నర్స్ : ఆఁ, ఆఁ, ఆగు, వుమా! (పట్టుకొని ఆపుచేసి) ఒరేయ్ భూషణం! ఇక్కడనుంచైనా వుమను గుంజీలు తీయించకురా!....చక్కటి అభ్యుదయ నాటకాలు రాయ్. యీ విషయంలో.........(లోపల ధ్వనికాగా అంతా అటు చూస్తారు. నేపథ్యంలో జనం కదంత్రొక్కుతూ పోతూ పాడుతున్నపాట వినిపిస్తుంది.)

"సింధూరం, రక్తచందనం
బంధూకం, సంధ్యారాగం
పులి చంపిన లేడినెత్తురూ
ఎగరేసిన ఎర్రని జండా,
రగులుకొనే రాక్షసిబొగ్గు
పోటెత్తిన సప్త సముద్రాల్
చెలరేగిన జనసమ్మర్దం
కావాలోయ్, నవకవనానికి........"

విన్నావా? ఆ గేయాన్నే ఆదర్శంగా పెట్టుకో. అందులోనే నీమేలూ, లోకంమేలూ ఇమిడుంది.

భూష: ఒరేయ్, నర్స్! నీ ఋణం తీర్చుకోలేనురా. కార్మికుడుగా నీ పోరాటశక్తిని, నాయకుడుగా నీ మేధాశక్తిని నా నాటకానికి ప్రసాదించి జీవంపోశావ్! ఏమైనా కార్మికవర్గమే యీ ప్రపంచానికి పురోగామి. నే నింకో అడుగు ముందుండి ఇంకా శక్తివంతమైన నాటకాలు రాస్తా.

[లోపల "నరశింహ్వాంగారూ, నరశింహ్వాంగారూ" అన్న కేకలు.]

నర్సు :
భూష : } ఎవరూ?

[లోపల "మన నాటక ఆర్గనైజరును పోలీసులు అరెస్టు చేశారు. త్వరగా రండి! మీకోస మంతా ఎదురు చూస్తున్నారు."]

నర్సు : వస్తున్నా, పద.

భూష : ఏమిటిరా యీ దారుణం? ఎందు కీ అరెస్టు? నాటకంలో హింసను ప్రేరేపించలేదే? నీవన్నట్టు బహుజన రంజకంగానే తయారుచేశానే!

నర్సు : అక్కడే వుందిరా బ్రదర్! బహుజనరంజకమైన దేదైనా యీ ధనికవర్గానికి మరణశాసనమే! అందుకే తన పోలీసు దూతల్ని పంపింది. అంతా "సెబాష్" అన్న 'మాభూమి', 'ముందడుగు', 'ఎవరు దొంగ?' నాటకాల్ని ఎందుకు నిషేధించిందంటావ్? ఎంతకైనా పూనుకుంటుం దీ వర్గం. యీ వర్గానికి తుపాకిగుండుకన్నా మారణాస్త్రం ఐక్యశక్తే. అందుకే ఐక్యఉద్యమానికి ప్రపంచంలో

యింత ప్రాముఖ్యం. యిప్పుడు తెలిసిందా అసలు సమాజానికి శత్రువులెవరో? అందుకే కవి కుళ్ళును బయట పెడితే చాలదు. దీన్ని కడిగేమార్గంకూడా చూపాలి.

భూష : అవును, ఇప్పుడు నాకు మరీ స్పష్టమయింది. ఇక కత్తి కంటె కరకైనది కలమని చాటుతా.

నర్సు : సరే! నే వెళ్ళొస్తా.....వస్తా—వుమా!

వుమ : మంచిది అన్నయ్యా!

భూష: నేనూ వస్తా. మన ఆగ్గనైజరును ఎందుకు అరెస్టుచేశారో తెల్సుకుందాం. కార్మికులకు కవి ఎన్నడూ వెనకపడడు. పదరా నర్సూ!

నర్సు: అయితే రా! (వెడతాడు)

భూష: పాప భద్రం వుమా! (వెళతాడు)

వుమ: జయం! వెళ్ళిరండి. (చేతులెత్తి వూపుతో)

జయహో! జయహో! జయహో!
జయ జయ జయ జయహో
బీనా, బిక్కీ అంతా ఒకటై
అండదండగ వుండగా
అడుగడుగులో ఆటంకం
కృశియించి, నశియించి, హరియించిపోదా?
జయము మీకు తథ్యం!
సుఖము మనకు సత్యం!! ॥జయహో॥

[తెర]

28-8-54

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL A104 B141 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-2 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |